# పల్నాటి వీర చరిత్ర

## పీఠిక

పండిత ఉమాకాన్త విద్యాశేఖరులు

సంపాదకులు : డా॥ అక్కిరాజు రమాపతిరావు



**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం**

హైదరాబాదు

**PALANAATI VEERA C THRA**

Editor - *Pandita Umakanta Vidya Sekharulu*



ప్రచురణ సంఖ్య : 187

ప్రథమ ముద్రణ : 1997

ప్రతులు : 1000

వెల రూ. : 40/-

ప్రతులకు :

డైరెక్టర్, ప్రచురణల విభాగం

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం

లలిత కళాక్షేత్రం

పబ్లిక్ గార్డెన్స్, హైదరాబాద్ – 500 004

ISBN No. : 81 - 86073 - 03 - 5

# ముందుమాట

బోధన, పరిశోధన, ప్రచురణ అనే త్రివేణీ సంగమం లక్ష్యంగా తెలుగు భాషా సాహిత్యాలు, చరిత్ర, కళ, సంస్కృతి మొదలైన రంగాలలో కృషి సల్పడానికి 11 సంవత్సరాల క్రితం ఆవిర్భవించిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం గణనీయమైన ప్రగతిని సాధిస్తోంది. అంతకు పూర్వం ఉన్న పలు అకాడమీలు, తెలుగు భాషా సమితి, అంతర్జాతీయ తెలుగు సంస్థ విశ్వవిద్యాలయంలో విలీనం కావడంతో పైన పేర్కొన్న లక్ష్యాలతో పాటు మరిన్ని బాధ్యతలు విశ్వవిద్యాలయానికి సంక్రమించాయి. బహుముఖీన కార్యక్రమాలతో విశ్వవిద్యాలయం తన ఆశయం, ఆదర్శాల సిద్ధికోసం నిర్విరామ కృషిచేస్తూనే ఉన్నది.

పైన పేర్కొన్న అన్ని రంగాలలోను కొత్త పుస్తకాల ప్రచురణలతో పాటు అలభ్య, అముద్రిత గ్రంథాల ప్రచురణను కూడా విశ్వవిద్యాలయం చేపట్టి ఇప్పటికి ఎన్నో ప్రముఖ గ్రంథాలను ప్రచురించింది. వాటికి పాఠక లోకం నుంచి ఆదరం కూడా లభించింది. 'వ్యాఖ్యా స్రవంతి' శీర్షికన సుప్రసిద్ధ పండితులచే క్లిష్టమైన ప్రాచీన కావ్య ప్రబంధాలకు వ్యాఖ్యానాలు రాయించి ప్రకటించే ప్రణాళిక కూడా కొనసాగుతున్నది. ఇప్పటి వరకు ఈ ప్రణాళికలో కుమార సంభవం, కాశీఖండం, శివరాత్రి మహాత్మ్యం వంటి కావ్యాలను వ్యాఖ్యాసహితంగా ప్రకటించడం జరిగింది. ఇవి సాహితీ ప్రియులకెంతో ప్రయోజనకరంగా ఉన్నాయి.

తెలుగులో "విజ్ఞాన సర్వస్వ" సంపుటాలను తయారుచేయించి కొత్తగా వెలువరించడం జరిగింది. ఆ వరుసలో "విశ్వసాహితి"ని, ఆంగ్లంలో 'ది హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ ది ఆంధ్రాస్" అనే పేరుతో ఒక సంపుటాన్ని ప్రచురించడమైంది. భాషాభివృద్ధి కృషిలో భాగంగా 'తెలుగు భాషా చరిత్ర' 'ద్రావిడ భాషలు' మొదలైన వాటిని పునర్ముద్రించడమైంది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంఘిక సంక్షేమ శాఖ వారి సహకారంతో డా॥ బి.ఆర్. అంబేద్కర్ రచనలు – ప్రసంగాలు 10 సంపుటాలుగా ప్రచురించడం జరిగింది.

శ్రీనాథ మహాకవి రచించిన "పల్నాటి వీరచరిత్ర" కి సంపాదకులు శ్రీ ఉమాకాన్త విద్యాశేఖరులుగారు మొదట వీరు మౌఖికంగా పాడుతుండగా విని, ఆ తదుపరి ఆంధ్ర దేశంలోని వివిధ ప్రాంతాల నుండి సేకరించిన నాలుగు ప్రతులను ఆధారంగా చేసుకుని,

శ్రీ అక్కిరాజు శంకర నారాయణగారు నైజాం ప్రాంతం నుండి తెప్పించిన ప్రతిలోని 'బాలచంద్ర యుద్ధం' సమగ్రంగా ఉండటంవల్ల దాన్ని ప్రధానంగా తీసుకుని పాఠ్య నిర్ణయం చేశారు. మొదటి ముద్రణకు 87 పేజీల సమగ్ర సంపాదకీయం రాశారు. ద్వితీయ ముద్రణకు ఆంగ్లంలోనూ, తెలుగులోనూ 100 పేజీల పీఠిక రాశారు. ఒక జానపద వీరగాథపై ఇన్ని వివరాలతో కూడిన వ్యాసం రాయడం తెలుగులో ఇదే మొదటిసారి. తమ వ్యాసంలో సంస్కృత వృత్తాలైన శార్దూల మత్తేభాల్లో కాకుండా దేశీ ఛందస్సులో రాయడం మొదటి విశేషంగా, ద్వితాయాక్షరపు ఆట లేక పోవడం రెండో విశేషంగా, అనువాదం కాకుండా మూలగ్రంథం కావడం మూడో విశేషంగా, ఆంధ్రుల్లో వీరత్వాన్ని బోధించే ప్రబంధ కావ్యం కావడం నాలుగో విశేషంగా పేర్కొన్నారు.

శ్రీ అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులగారి 'నేటి కాలపు కవిత్వం' గ్రంథాన్ని కూడా విశ్వవిద్యాలయం తరపున ప్రచురించడం జరిగింది. ఈ విధంగా వారి పాండిత్య పరిశోధనల్ని పరిశోధకులకి అందించే అవకాశం కలిగింది.

ఈ గ్రంథానికి డా॥ అక్కిరాజు రమాపతిరావు చక్కని సంపాదకీయం రాశారు. వారికి విశ్వవిద్యాలయం పక్షాన కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాం.

సం/-

**ఆచార్య నాయని కృష్ణకుమారి**

హైదరాబాద్

ఉపాధ్యక్షులు

24-1-1997

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

# ఉమాకాంత విద్యాశేఖరుల విమర్శ సిద్ధాం  లు

- డా. అక్కిరాజు రమాపతిరావు

చరిత్ర ఎప్పుడూ సరళరేఖవలె సాగదు. పునస్సమీక్షితం కాకుండా పురోగతికం కాదు. దాని స్వభావం చాక్రికం అని చెప్పవచ్చు. చరిత్ర పునరావృతం కావడం సర్వసాధారణంగా దర్శనీయం. భారతదేశంలో బయలుదేరిన దివ్యజ్ఞాన సమాజోద్యమం ఇందుకు నూటికి నూరుపాళ్ళు సాక్ష్యం పలుకుతున్నది. దివ్యజ్ఞాన సమాజోద్యమం వ్యాపనంలో ఇంకొక విశేషం ఏమిటంటే దీని ఆద్యప్రవర్తకులు పాశ్చాత్యులు. భారతీయ గుప్తవిద్యలు, ఆధ్యాత్మిక గవేషణలు, తపస్సిద్ధులు, అర్చావిధులు, సకల ప్రపంచానికి ఉపాదేయమన్నది ప్రతిపాదించిన వారు పాశ్చాత్యులు. అవి పునరుజ్జీవనార్హములనీ పునరుద్ధరణ దిశలో ఈ కృషి సాగాలనీ ఈ ఉద్యమాన్ని చేపట్టారు వారు. దీనితో సహజంగా సంస్కృత భాషకు ప్రాధాన్యం, ప్రాచుర్యం కలిగాయి. ఏమంటే భారతీయుల గుప్త విద్యలన్నీ సంస్కృతంలోనే ఉన్నాయి కనుక. రాజారామమోహనరాయ్, కేశవచంద్రసేన్, ప్రతాపచంద్రమజుందార్, పండిత శివనాథశాస్త్రి ప్రభృతులు పాశ్చాత్యమత సాంస్కృతిక మూల్యాలపట్ల ప్రబుద్ధులైనట్లే ఆ తర్వాత సుమారు అర్ధ శతాబ్దానికి మేడమ్ బ్లావట్స్కీ, హెచ్.ఎస్. అల్కాట్, డబ్లు లెడ్ బీటర్ అనీబిసెంట్, జె.హెచ్. కజిన్స్ మొదలైన వారు భారతీయ ఆధిభౌతిక విజ్ఞానంపట్ల, ఆధ్యాత్మిక సంప్రదాయంపట్ల, గుప్త విద్ల పట్ల వ్యామోహితులైనారు. పెద్దపెద్ద గ్రంథాలు రచించారు. పత్రికలు నడిపారు. జాతీయ అంతర్జాతీయ సమావేశాలు, సదస్సులు నిర్వహించారు. ఇది చరిత్ర చక్రనేమిక్రమ స్వభావాన్ని తెలియజేస్తున్నది. పాశ్చాత్యుల సన్నికర్ష దైవ నిర్దేశితమని స్వాగతించిన ఒక తరం భారతీయులు మణక తరంలో వారి వలస సాంస్కృతిక దురాక్రమణల తీరు తెన్నులను అసహ్యించుకునేందుకు సిద్ధమైనారు. భారతీయులలో పాశ్చాత్య సంస్కృతి పట్ల, జీవన మూల్యాలపట్ల సర్వాత్మనా వ్యతిరేకత వ్యక్తమయ్యేందుకు రంగం సిద్ధమైంది. ఎక్కడైనా ఒక తీవ్ర ప్రతి ఘటనోద్యమకాలంలో, సందర్భంలో నేపథ్యంలో అతివ్యాప్తులు అవ్యాప్తులు తప్పవు. అతివాదాలు తప్పవు. పునుద్ధరణ వాదంగా తిరోగమన శీలంగా యీ పరిణామాలను కొందరు ఈసడించవచ్చు. ప్రతీపశక్తుల మోహరింపుగా కొందరు సిద్ధాంతీకరించవచ్చు. కాని ఈ పరిణామం అనివార్యం. వలస దేశ దురాక్రమణదారులను తిప్పికొట్టడంలో పాలితుల సాంస్కృతిక మూల్యాల పునరేకీకరణ తప్పదు. ఈ దృష్ట్యా అర్థం చేసుకోకపోతే బాలగంగాధరతిలక్, అరవింద్‌ఘోష్‌ల సాంస్కృతిక పునరుజ్జీవన ప్రయత్నాలు అర్థంకావు. ఆర్యసమాజం వారి ఆంగ్లోవేదిక పాఠశాల స్థాపనావశ్యకత అర్థం చేసుకోలేము. భగవద్గీతకు 20వ శతాబ్దంలో వచ్చినన్ని వ్యాఖ్యానాలు మరే శతాబ్దంలోనూ

వ్యాజచిత్రాలు త్రిలింగ పత్రికలో కనపడతాయి. మూడునాలుగేళ్ళ కన్నా ఈ సంపాదకత్వ బాధ్యతను కూడా ఉమాకాంతంగారు నిర్వహించినట్లు కనపడదు. కుటుంబ సంబంధమైన చిక్కులతో ఉమాకాంతంగారు సతమతమయ్యేవారు. ఆయన కుమారుడు ఎనిమిది తొమ్మిదేండ్ల వాడు చనిపోవటం ఆయనకు అశనిపాతం. ఆ పిల్లవాని పేరు నళినీమోహన మంత్రి అని ఆయన నాజూకుగా తన కలకత్తావాసం సార్థకంగా పెట్టుకున్నారు. త్రిలింగపత్రిక సంపాదకత్వ బాధ్యతను స్వీకరించేనాటికే ఉమాకాంతంగారు పల్నాటి వీరచరిత్రను, మెడోస్ టైలర్ నవల, టిప్పుసుల్తాన్‌కు తెలుగు అనువాదాన్ని ప్రకటించి ఉన్నారు. కవిత్వతత్త్వ విచారంలో డా. కట్టమంచి రామలింగారెడ్డి వెలువరించిన సంప్రదాయ వ్యతిరేకతను ఉమాకాంతంగారి పల్నాటి వీరచరిత్ర పీఠికలోనూ చూడవచ్చు.

సాహిత్యానికి సంబంధించి ఉమాకాంతంగారు పూర్వసంప్రదాయ వాదికాదు. 1910లో బందరు నుండి వెలువడిన ఆంధ్రభారతిలో ఆయన విద్యారంగంలో సమూలమైన మార్పులు కోరాడు. మాతృభాషా మాధ్యమ ప్రాశస్త్యం గురించి ఆయన నొక్కి చెప్పారు. కొమర్రాజు లక్ష్మణరావుగారితో వీరు తరచు కలుస్తూ ఉండేవారని తెలుస్తున్నది. లక్ష్మణరావుగారు మాతృభాషా మాధ్యమే మేలు అని తమ మహరాష్ట్ర నివాస అనుభవంతో వాదిస్తూ ఉండేవారు. మొదట్లో ఉమాకాంతంగారు వ్యావహారిక భాషోద్యమానికి సుముఖులుగా ఉన్నట్లు కనపడదు. ఈ విషయంలో కూడా ఉమాకాంతంగారి పై లక్ష్మణరావు అభిప్రాయాలు మొదట్లో మొదట్లో పనిచేసినట్లు తోస్తుంది. తర్వాత ఆయన గిడుగు, గురజాడలతో చర్చించిన తర్వాత తన అభిప్రాయాలు మార్చుకున్నట్లు తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారి సాక్ష్యం ఉన్నది. 1936వ సంవత్సరంలో ప్రారంభమైన 'ప్రతిభ'లో శ్రీ శివశంకరశాస్త్రి 'నాలో మార్పు' అని తమ సాహిత్య జీవితానుభవాలు ప్రకటించారు. ఆ నవంబరు సంచికలో (3వ సంచిక) శ్రీ శాస్త్రిగారు ఉమాకాంతంగారు తమకు మిత్రులనీ వారికి దీర్ఘసమాస జటిలశైలి ఎంతో ఇష్టమనీ ఆయన ప్రభావం తనపై పనిచేసి తాను పెటుకుగ్రాంథికం అభిమానించేవాడిననీ రాశారు. ఆయనన్నారు, "సంస్కృత గద్యప్రభావము గాఢంగా వుండేది. సలహా ఇవ్వతగినవాళ్ళు లేరు, ఒకవేళ ఇచ్చినా అంగీకరించేవాణ్ని కానేమో! నా మిత్రుడు అక్కిరాజు ఉమాకాంతంగారి వల్లనే ఈ 'డబ్బాశైలి' కొంతవరకు అలవాటు పడ్డది. మరికొన్ని సంవత్సరాలకు ఆయన వల్లనే ఇది తొలగిపోయింది. ఉమాకాంతంగారు ఆ రోజుల్లో తెనిగించిన 'టిప్పుసుల్తాను' బాగా నచ్చింది. అందులో ఒక వాక్యం ఇంచుమించుగా ఇప్పటికీ జ్ఞాపకం వస్తుంది. 'మార్గోపాంత పల్వ్వాలానీకంబుల భేకభేకీ నాథంబు.... సంకులంబయ్యె" ఇటువంటి వాక్యాలు మహామధురంగా వినబడి ఆ ప్రకారంగా రాస్తుండేవాణ్ణి. నేనెరిగిన కొద్దిమంది పండితులూ ఇటువంటి రచనకే ప్రోత్సాహం చేసేవారు.'
' ఇది 1912 సం. నాటిమాట. తర్వాత శాస్త్రిగారి జీవితంలో ఎన్నో అధ్యాయాలు దొర్లిపోయాయి.

కృతక గ్రాంథికభాషాభిమానం నుంచి వ్యావహారిక భాషవైపు ప్రీతి ఏ విధంగా సిద్ధించిందీ వారే ఇట్లా ఆ తర్వాత ప్రతిభ సంచికల్లో వివరించారు.

"కొన్నాళ్ళు ఇలా గడుస్తూ వుండగా నా మిత్రులు అక్కిరాజు ఉమాకాంతంగారు ఒకనాడు గుంటూరు వచ్చినట్టు వినిచూడ్డానికి వెళ్ళాను. ఆయన సంస్కృతాంధ్రాలలో బాగా కృషిచేశాడు. శ్రీనాథుని పల్నాటి వీరచరిత్ర సంపాదించి ప్రకటించి ప్రసిద్ధిచెందాడు. కొంతకాలం ఆంధ్రసాహిత్య పరిషత్తుకు కార్యకర్తగా పనిచేశాడు. త్రిలింగ పత్రికకు కొన్నాళ్ళు సంపాదకుడుగా వున్నాడు. కలకత్తాలో మహామహోపాధ్యాయ ప్రమథనాథ, తర్కభూషణ మొదలయిన మహా విద్వాంసుల వద్ద దర్శనాలు చదువుకున్నాడు. మేమిద్దరమూ చిన్నతనంలో కాలేజీలో మూడేళ్ళు సహాధ్యాయులము. కథలు వ్రాసినట్టు ఆయనతో ఇష్టాగోష్ఠిలో అన్నాను. ఒకకథ చదివి వినిపించాను. విని ఆయన 'బాగున్నది కాని వాడుకభాషలో వుంటే ఎక్కువ బాగుండేది' అన్నారు. నమ్మడానికి వీల్లేని మార్పు ఏదో నాలో కలిగింది. ఆ క్షణంలో కంటికి వున్న పొరలు వెంటనే రాలిపోయినట్టయింది.'మీరు విద్వాంసులు కదా, వాడుక తెనుగులో కథలూ గట్రా వ్రాయాలని మీకెందుకు బుద్ధి పుట్టింది?' అన్నాను. ఆయన యిలా చెప్పారు? ఒక పర్యాయం గురజాడ అప్పారావు పంతులుగారు మదరాసు వచ్చినప్పుడు, ఆయనతో నేను నిష్ఠూరంగా మాట్లాడాను. మీరు భాష పాడుచేస్తున్నారని. అప్పారావుగారు మహాశాంతంగా, 'జయంతి రామయ్యపంతులుగారితో ఎంతచెప్పినా లాభంలేకపోయింది. మీకింకా చిన్నతనం' అన్నారు. దానితో నాలో మార్పు వచ్చింది. అప్పట్నుంచి వాడుకభాషలో తప్ప వ్రాయనని నిశ్చయం చేసుకున్నాను. గ్రాంథికభాష అంటే నాకు చాలా తలనొప్పి' అన్నారు. (పుటలు 373,74 - ప్రతిభ సం.1; సం.4 - 1937 ఫిబ్రవరి) ఉమాకాంతంగారికి గురజాడ అప్పారావు పంతులుగారితో సమావేశం పందొమ్మిదివందల పదిహేనుకి ముందే అని తెలిసిపోతున్నది కదా. 1912లో టిప్పు సుల్తాన్ రచనాకాలం నాటికి రెండుమూడేళ్ళ తర్వాత కాలానికి ఆయనలో గురజాడ తెచ్చిన మార్పు ఎంతటిదో తెలుస్తున్నది. ఉమాకాంతంగారి వ్యవహారిక భాషా రచనా ప్రీతి ఎంతవరకు పోయిందో 1920ల నాటి శ్రీ శివశంకరశాస్త్రి వెల్లడించిన ఒక ఉదంతంబట్టి కూడా తెలుస్తున్నది.

"ఉమాకాంతంగారికి జబ్బుచేసినప్పుడు "వీలునామా" వ్రాస్తూ వాడుకభాష అమలులోకి తీసుకరావలసిందనీ, గ్రంథకర్తలచేత అదే ఉపయోగం చేయించవలసిందనీ నాపేర ఉద్బోధన వాక్యాలు అందులో చేర్చారు. తరవాత దైవానుగ్రహం వల్ల ఆయనకు ఆరోగ్యం కలిగింది. ఈ సంగతి నాకు తెలిసినప్పుడు నేను చాలా సంతోషించి ఆయన కోరిక అమలులో పెట్టడానికి పూనుకొన్నాను" (ప్రతిభ - అదే సంచిక; పుట 374). 1914 నుంచి 1920 వరకు ఉమాకాంతంగారు మద్రాసులోనే ఉంటున్నా ఆయన ఆరోగ్యం ఒడిదుడుకులతో గడచినట్లు కనపడుతుంది.

చేయలేకపోయినారు.

1929 ప్రాంతాలలో ఉమాకాంత విద్యాశేఖరులు మద్రాసులోని ప్రెసిడెన్సీ కాలేజీలో ఆంధ్ర పండిత పదవినధిష్టించారు. వావికొలను సుబ్బారావు (వాసుదాసు) గారి తర్వాత ప్రెసిడెన్సీ కాలేజీ పండిత పదవి వీరికి లభించింది. సుమారు 10 సంవత్సరాలకాలం వీరు ఈ పదవిని నిర్వహించినట్లు కనపడుతుంది. శరీరానారోగ్యకారణం వల్ల 50 సంవత్సరాల వయసుననే వీరు కళాశాల పండిత పదవీ విరమణం చేసినట్లు కనపడుతుంది.

1938 ప్రాంతాలలో కళాశాల పండిత పదవిని విరమించి ఉమాకాంత విద్యాశేఖరులు స్వగ్రామం చేరారు. వారే చెప్పుకొన్నట్లు అదివారికి చాలా కష్టకాలం. ఉమాకాంత విద్యాశేఖరులది గుత్తికొండ స్వగ్రామం. ఇది పలనాడు తాలూకాలో ఉంది. పదితరాలుగా అక్కిరాజువారి వంశవృక్షం ఉన్నది. అక్కిరాజువారి కుదురు ఈ గుత్తికొండ గ్రామం. ఉమాకాంతంగారి తల్లిదండ్రులు లక్ష్మమ్మ, లక్ష్మీ నారాయణగారలు. వీరికిద్దరు తోబుట్టువులుండేవారు. ఒకరు వాసుదేవరావూ, ఇంకొకరు భారతమ్మ అని తోబుట్టువు. 1942వ సంవత్సరలో ఉమాకాంతం గారు గుత్తికొండలోనే మరణించారు. అప్పటికాయన అక్కగానూ, తమ్ముడూ జీవించే ఉన్నారు. తమ్ముడి దత్తపుత్రుడు కూడా సంతానం లేకుండా చిన్నవయస్సుననే మరణించడంతో ఉమాకాంతంగారి గ్రంథ సంచయమూ ముద్రితా ముద్రిత రచనలు చెల్లాచెదరై పోయినవి. 1942 మార్చిలో గుత్తికొండలో ఉమాకాంతం స్వర్గస్థులైనారు.

ఆధునిక తెలుగు సాహిత్యంలో అక్కిరాజు ఉమాకాంతంగారు అగ్రశ్రేణి విమర్శకులుగా నిలుస్తారు. భారతీయ సంస్కారంతో సంలీనంకాని విదేశీయమైనదంతా త్యాజ్యమనీ, శ్రుతి స్మృతి పురాణేతిహాస ధర్మశాస్త్ర సర్వసంస్కృత వాఙ్మయం పూజ్యమనీ ఆయన అభిమతం. ధర్మావిరుద్ధమైన శృంగారమే ఉపాదేయమని వారి భావన. ఈ దృష్టితో వారు వాఙ్మయ దర్శనం రచించాలని సూత్ర ఫక్కికరాసి పెట్టుకున్నారు. దీనికి అనుబంధంగా నేటికాలపు కవిత్వం రచించారు. ఈ విమర్శ గ్రంథంలో నాడు ప్రసిద్ధులైన కవిపండిత విమర్శకుల రచనలన్నీ సమీక్షితమైనవి. మొగమాటం లేకుండా తాము అనుచితమనుకొన్న అభిప్రాయాలన్నీ తీవ్రంగా నిరసించారు విద్యాశేఖరులు. భావకవిత్వాన్ని ఆయన సహించి ఉపేక్షించేవారేమోకాని అది తెలుగు సాహిత్యంలో నూతన యుగస్థాపనమనీ సంస్కృత దాస్యం నుంచి తెలుగు సాహిత్యం విముక్తమైన సాహిత్య చారిత్రక సన్నివేశమనీ, కవులకు స్వేచ్ఛ ఉండాలనీ, కవులు సర్వతంత్ర స్వతంత్రులనీ భావకవిత్వాన్ని మెచ్చుకొనేవారు, పీఠికలు రచించినవారూ అనడంతో ఆయన తటస్థంగా ఉండలేకపోయినారు. నన్నయ, తిక్కనలనే తప్పుపట్టిన ఉమాకాంతంగారు సమకాలీన కవుల తాననుకొన్న వెర్రిపోకళ్ళను విమర్శించకుండా ఊరుకుంటారా? అంగవిస్తరమనే

కావ్యదోషానికి కీచక విరహఘట్టంలో తిక్కనగారు పాల్పడ్డారని ఈసడించుకున్న ఉమాకాంతంగారు భావకవుల ప్రేమోల్బణాన్ని మెచ్చుకుంటారా? ఎంకిపాటలలో కొంతవరకు నవ్యత ఉన్నదని ఆయన వొప్పుకోవటం ఆయన నిజాయితీకి సహృదయతకు నిదర్శనం.

ఉమాకాంతంగారి ప్రామాణికమైన కొలబద్దలు వేరు. అట్లా అని నవ్యసాహిత్యాన్నంతా ఆయనతోసి రాజనలేదు. ఆధునిక తెలుగుసాహిత్యంలో తొలి తరంకథా రచయితలలో ఆయన ఒకరు. తాము నడిపిన త్రిలింగ పత్రికలో ఆయన చిన్నకథలు ప్రకటించారు. అవి కళారూపంగా గొప్పకథలు కాకపోయినా వస్తురూపంగా నవ్యత సంతరించుకున్నవే. కులపాలికా ప్రణయానికీ నిర్మలమైన దంపతీ శృంగారానికీ ఆయన తన కథల్లో ప్రాధాన్యం ఇచ్చాడు.

"భవిష్యద్గృహస్థుడు" అనే కథలో ఉమాకాంతంగారు కుటుంబ జీవనంలో స్త్రీకి మానసిక శారీరక విశ్రాంతి వికాసాలు లేకపోవడానికి ఎంతో బాధపడ్డారు. రైలు ప్రయాణంలో ఎదుటి సీటులో తరుణవయస్కురాలైన ఒక స్త్రీ ఇద్దరు పురుషులతో కథకుడు కూడా ప్రయాణం చేస్తుండగా కథకుడి మనసులో చెలేగిన భావాల స్వగతం రూపంగా ఈ కథ సాగుతుంది." నూతనముగ గృహస్థాశ్రమమున బ్రవేశింప బోవు మానవుల మనోవికారము లెట్లుండునో యిందు చక్కగ బ్రదర్శింపబడినవి. అపూర్వ వర్ణనలతో నిండియుండును" అని ఈ కథను గూర్చి పరిచయ వాక్యాలు చెపుతున్నాయి.

ఎదుటి సీటులో ప్రయాణిస్తున్న వారిని చూచి పరిపరివిధాల తలపోస్తాడు కథకుడు. వాళ్ళనుగూర్చి కుశంకలు, అనుమానాలు, పాపపు ఊహలు కూడా పెంచుకుంటాడు. ఏమంటే ఆ తరుణి ఎంతో స్వతంత్రంగా స్వేచ్ఛగా నాగరకంగా ప్రవర్తిస్తూ ఉండటం, ఆ కాలంలో గృహస్థ జీవనంలో ఇలాటి సన్నివేశం కలికంలోకి కూడా కనపడకపోవడంతో కథకుడికి రాకూడని ఆలోచనలు వస్తాయి. చివరకు ఆ తరుణులలో ఒకరు ఆ అమ్మాయి భర్త అనీ ఎండవ వాడు అతడు తరుణుడి మేనమామ అనీ తెలుస్తుంది. ఆనాటి సాంఘికస్థితిగతులను ఆ ప్రయాణం పొడవునా కథకుడు తలచుకొని విచారపడతాడు.

"హిందూభర్తా! ఏనాడు దాంపత్య పరమార్థంబు గ్రహించెదవు? ఆనాడు గదా గృహములు గృహములు, ప్రేమమా! అవిగో నీవులేని దంపతీహృదయంబు లెండిబండలైయున్నవి.

కులకాంతా నిన్ను మామలు నిరాదరించుచున్నారు. అత్తలణగద్రొక్కుచున్నారు. ఆడబిడ్డలరకంట జూచుచున్నారు. కొందరు కవులేలనో నీకు విషముపోసిరి. కులకాంతా ఏనాటికి వికసనము నొందెదవు" అని యతడు చింతించెను - అన్నారు ఉమాకాంతంగారు.

"యౌవనుడును యువతియునతనికి దేవతాయుగ్మమువలెగన్పట్టిరి. అసూర్యం

పశ్యమైన రాజపత్ని మొదలుకొని పిడిగ్రుద్దులచే వీపుకాయలుకాసిన యిల్లాలి వరకు కులకాంతలందరును నతని తలంపునకు వచ్చిరి. భర్తచే గొట్టులు వడకపోయినను పనిచేయుట తినుట, కనుట, సొమ్ములు పెట్టుకొనుట తప్ప మరియేమి యెరుంగని కులకాంతలతని మనోనేత్రమున కగపడిరి. మూలను గూర్చుండి మాసిన చెరగుతో గన్నీరు తుడుచుకొను కులకాంతయగపడెను - వంటయింటిలో కొంగువేసుకుని పరుండి నా కష్టము లెప్పుడు కడతేర్చెదవో భగవంతుడాయని విలపించుచున్న కులకాంతయగపడెను. పోరుపడ జాలక కడగండ్లు తీర్చువారిక లేరని నిరాశతో బ్రాణములు తీసుకొనుటకై బావికడకు బోలేకపోబోవుచున్న కులకాంతయగపడెను. అయ్యో! ఆ గృహములతనికి నరకకథలను జ్ఞప్తికి దెచ్చినవి.

ఆనాటి సాంఘిక వ్యవస్థ కథానాయకుడి స్వగతం ద్వారా కనులకు కడుతున్నది. 'బ్రాహ్మణేతరుడుగాన యౌవనుడీడువచ్చిన యువతి యెక్క గుణరూపములను జూచి వివాహమాడియుండును. అస్మాదృశబ్రాహ్మణులకే భాగ్యములేదు గదాయని యతడు చింతించెను'.

కథానాయకుడి దృష్టిలో ఆదర్శ దాంపత్యం ఎలా ఉండాలో అతడి మనోవీథిలో ఈ విధంగా పొడకడుతుంది. "ఈడుజోడు కుదిరి పొరలేని మైత్రితో గృహములయందు మెలగు దంపతులను జూచి, మధుమాససాయం సమయములందు జలాశయ తీరంబుల శీకరసమ్మిళిత మరుత్కిశోరంబులకు జొక్కెడు దంపతులను జూచి మనోహర శరన్నిశావేళల లసచ్చంద్రికాపటల ధవళిత సికతాతలంబు లందు సంసక్తబాహులతలతో నల్లన విహరించు దంపతులను జూచి ప్రేమ కివి చిహ్నములా........" యనుకొంటాడతడు.

'కూతురులను బళుప్రాయులుగ నుంచు తలిదండ్రులు మార్గము నిరోధించు నడ్డదూలముల వలెనతనికి బొడకట్టిరి.' అన్నారు ఉమాకాంతం. 'నభజేత్స్త్రీ స్వతంతా' మని మనువు చెప్పటం తలచుకొని సీతాకాంతం బాధపడతాడు. స్వగత రూపంలో ఈ కథను విన్పించిన కథకుడి పేరు సీతాకాంతమని రచయిత పేర్కొన్నారు. ఈ కథ 1912-1913వ సంవత్సరానికే ఉమాకాంతంగారు రచించడం గొప్ప విశేషం. అప్పటికే ఆయన అభ్యుదయ భావాలు ఏ విధంగా రూపుదిద్దుకుంటున్నాయో ఇందువల్ల తెలుస్తుంది. బహుశా కలకత్తా రాకపోకల సందర్భంగా జరిగిన రైలు ప్రయాణాలలో ఆయన తనకు రైల్లో కనపడిన తరుణ దంపతులవంటి వారిని చూసి ఉంటారు. ఈ కథ అంతా అల్లి ఉంటారు. స్త్రీ మానసిక భౌతిక ఆరోగ్యానికి కంకణం కట్టుకున్నాడనీ యుగపురుషుడనీ ప్రశంసితుడైన తెలుగు కథకుడప్పటికింకా కళ్ళు తెరవలేదు. గురజాడ అప్పారావుకి అవ్యవహితపరంగానే ఉమాకాంతం కథలు రాయడం గమనార్హం. ఆ కథల్లో స్త్రీ పురుషుల సమానత్వాన్ని ప్రేమబంధాన్నీ ఆయన ప్రతిపాదించాడు.

అయితే శైలిమాత్రం ఇంకా గ్రాంథికానికి దగ్గరగానే ఉంది. పరుషంగానే ఉందిగాని సరళంగా కాదు. గురజాడ అప్పారావు కూడా మొదటి కథను మొదటరాసినప్పుడు గ్రాంథికంలోనే రాసిన వైనం తెలుస్తున్నది. 1910లో ఈ కథ ఆంధ్రభారతిలో అచ్చైనప్పుడు అచ్చులో అరసున్నలు కూడా కనపడుతున్నాయి. అచ్చుకూర్పరి పుణ్యమో ఏమో చెప్పలేము. ఇంచుమించుగా 'టిప్పుసుల్తాన్' అనువాదం చేసిన కాలంలోనే ఉమాకాంతంగారు కథలు కూడా రాయడం మొదలుపెట్టి ఉంటారు. 'టిప్పు సుల్తాన్' నవల అనువాదానికి ఉమాకాంతంగారు కూర్చిన పీఠికలో ఆధునిక సాహిత్యంలో ప్రపంచ సాహిత్యంలోనే నవలా ప్రక్రియ ఆవిర్భావ వికాసాలను గూర్చి రాశారు. వచన రచనను నిరాదరణ చేయడం సాహిత్య వికాసానికి అవరోధమని ఉమాకాంతంగారీ పీఠికలో హెచ్చరించారు. 'తెలుగన్నను తెలుగు పుస్తకములన్నను తెలుగు గ్రంథకర్తలన్నను దృణముకంటే దేలికగజూచు కేవల సంస్కృత పండితులును గేవ లాంగ్లభాషా పండితులును మన తెలుగు నవలలను నిరసించుట యబ్బురము కాదు గదా "అని బాధపడ్డారు. ఈ పీఠికలో ఆయన. ఇంకా కళా సాహిత్య వికాసం గూర్చి ఇట్లా చెప్పారు. " చిత్ర లేఖనము కవితవీని యొక్క పరమార్ధమును జనులు గ్రహింపగలుగుట నాగరకతాభ్యుదయ సూచకంబని చెప్పవచ్చును. చిత్రలేఖనమున కనేకభంగుల మనము ప్రోత్సాహము కలుగజేయవలసి యున్నది" అన్నాను ఈ పీఠికలో. ఈ అనువాద నవలకు 32 పుటల పీఠిక రాశారు ఉమాకాంత విద్యాశేఖరులు.

గీత గోవిందానికి శ్రుతి రంజని పేరుతో ఒక వ్యాఖ్యానం కనపడుతున్నదనీ దీనిని శ్రీ రంగరాజ పుత్ర తిరుమల రాయలు విరచించినట్లు తాళ పత్రంలో పేర్కొనబడిందనీ కాని తిరుమల రాయలు ఈ వ్యాఖ్యాన కర్తకాడనీ చారిత్రక సాహిత్యాధారాలతో ఉమాకాంతంగారు నిరూపించారు. భట్టుమూర్తి వసుచరిత్రకు కృతి పతియైన తిరుమలరాయలే గొప్ప విద్వాంసుడైతే భట్టుమూర్తి చెప్పకమానునా? అంటారు ఉమాకాంతంగారు శ్రుతి రంజనిని గూర్చిన వ్యాసం ఆంధ్రప్రదేశ్ పత్రిక ఉగాది సంచికలో ప్రచురితమైంది. 'అరవ దేశమునందలి యాంధ్ర వాఙ్మయము' అనే పేరుతో ఒక వ్యాఖ్యా వివరణ సూచివంటి దానిని కూడా ఉమాకాంతంగారు ప్రచురించారు. ఆంధ్ర సాహిత్య పరిషల్లిఖిత పుస్తక సంచయం నుంచి ఈ సమాచారం సేకరించినట్లు తెలిపారు. ఇది ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ప్రచురితం. "ఆంధ్ర దేశముననంత సుప్రసిద్ధుడైన శ్రీ నాథుని గ్రంథ మొక్కటియైన సంచయమున గాన రాకుండుట చిత్రముగనున్నది. మొత్తము మీద మధ్య కవుల కావ్యములు నాథునికుల కావ్యములును వారు సేకరించిన వ్రాత ప్రతులను గూర్చి ఉమాకాంతంగారు వ్యాఖ్యానించారు.

శ్రీ ఉమాకాంతం గారిలో క్షణ క్షణం విమర్శకుడు తొంగి చూస్తూ ఉంటాడు. "విజయనగర రాజుల నాటి వాఙ్మయమే దక్షిణ దేశమున 18వ శతాబ్దియందు బయలుదేరిన

వాఙ్మయమునకు మాతృకగా నున్నది" అని వ్యాఖ్యానించడం ఉమాకాంతం గారి స్వోపజ్ఞతకు నిదర్శనం. ఈ సంచయంలోని వ్రాత ప్రతులను పురాణాలు, నిఘంటువులు వ్యాకరణం, ఛందస్సు, అలంకార శాస్త్రము, కళలు, పద్యకావ్యము, శతకము, దండకములు, యక్షగానములు, ద్విపదలు, వచన కావ్యాలుగా విభజించి ఒక్కొక్క దానిని గూర్చి సవిమర్శనాత్మక వివరణ సూచికను కూర్చారు ఉమాకాంతంగారు.

నేటి కాలపు కవిత్వం చివరి ప్రకరణమైన సంస్కారాధికరణంలో ఈ విషయాలనే ఉప సంహార వాక్యాలుగా తిరిగి విన్పించారు ఉమాకాంతంగారు.

"దేశంలో భారతీయ సంస్కార ప్రవాహాలు యింకి పోయినవి. విద్యాపీఠాలు అస్తమించినవి. గురు కులాలు రూపుమాసినవి. భారతీయ సంస్కారం లేని కేవల పాశ్చాత్య సంస్కారం బలప్రదం గాక ఆత్మ విముఖత్వాన్ని పర సంస్కార దాస్యాన్ని మనకు ఆ పాదించినవి. ఈ దశలో ఆంధ్రదేశంలో వెలువడుతున్న కృతులు యెండు నేలను మొలచిన గిటక గడ్డివలెను, యిమడక వెళ్ళి పోయిన ఆహారం".

సారాంశంగా ఈ పద్యకావ్యాలను గూర్చి చెబుతూ 'కవిత పతిత కావలసివచ్చెగదాయని పరితాపము కలుగక మానదు' అని విమర్శించారు. ద్విపద కావ్య ప్రశస్తిని నిరూపించారు. "సాధారణ పద్యకావ్యములు రచించుట కంటే గణప వరపు వెంకటకవి వలె బంధ కవిత్వము చెపుట కష్టతరము గదా. అందువలన బద్య కావ్యములకంటే బంధమయ కావ్యము లెక్కువగా నాదరింపదగినవని చెప్ప వచ్చునా'? అని ప్రశ్నించారు. ఇక దక్షణాంధ్ర భాషలోని అనుస్వారము, అచ్చుల మార్పులు, ద్విత్వము మొదలగునవి స్వర శాస్త్ర (Phonetocians) ప్రవిష్టులు గమనింపవలసిన విషయములు గదా!' అని భాషా శాస్త్ర అధ్యయనావశ్యకతను గూడ ఆనాడే ఉమాకాంత విద్యా శేఖరులు గుర్తించారు. ఆయన ఆధునికులలో అత్యంత సంప్రదాయపరుడు. సంప్రదాయజ్ఞులలో అత్యంత ఆధునికుడు అని వారి విమర్శలవల్ల స్పష్టమవుతున్నది.

ఉమాకాంతంగారి గ్రంథాలలో ముఖ్యంగా పేర్కొనవలసినవీ ఆయనకు పేరు తెచ్చినవీ ఆయన్నిస్మరించగానే వెంటనే స్ఫురించేవీ పీఠికా సహితమైన పలనాటి వీర చరిత్ర సంపాదకత్వం, నేటి కాలపు కవిత్వం, పాణినీయాంధ్ర వివరణం అనేవి. పాణినీయాన్ని ముందు సంచికలుగా ప్రకటించి తరవాత పుస్తకంగా తెచ్చారు ఉమాకాంతంగారు......... దేశీయ విద్యాశాలలు గానీ రాజకీయ విద్యాశాలలుగానీ భారతీయ సంస్కారం నిర్బంధంగా, ప్రధానంగా విదేశీయ సంస్కారం అంగంగా దేశీయులకు ప్రసాదించినప్పుడే యీ పంకం మనకు తొలగి మనం స్వచ్ఛదీప్తితో భారత జాతుల్లో ఉత్తమ స్థానం ఆక్రమించగలము. భారతీయ సంస్కార పరిపాకం పొంది స్వచ్ఛదీప్తితో భారత జాతుల్లో ఉత్తమ స్థానం ఆక్రమించగలిగినప్పటి

కృతులుగాని చిత్రాలుగాని మరేవిగాని ఒక ఆంధ్రులనేకాక సర్వ భారత వర్షాన్ని సర్వలోకాన్ని నూతన సందేశాలతో పవిత్రం చేయగలవు. ఆ నిమిషానికే నేను ప్రతీక్షిస్తున్నాను. జన్మాంతరంలోనైనా ఆ నిర్మలదశ చూడగలననే ఆశతో విశ్వాసంతో ఆంధ్రుల సంస్కారానికి సేవను ఆకాంక్షిస్తున్నాను' అని నేటి కాలపు కవిత్వం సమీక్షను ముగించారువారు.

ఉమాకాంత విద్యాశేఖరులది తీవ్రమైన వాదం అనుకొనేందుకు వీలుంది. మహాభారత రామాయణాలు యథామూలంగా మాత్రమే ఉండాలి కాని నన్నయ, తిక్కనాదులవి అనుచితానువాదాలనటం, మనువసుచరిత్రాది ప్రబంధాలు ఉత్తమ కావ్య కోటిలోవి కావనడం, యతిప్రాసల వల్ల తెలుగు పద్యం కొరగానిదై పోయింది అనడం, యతి ప్రాసలనియమం అనావశ్యకమనడం, తెలుగు పద్యమంతా పాదపూరణం కోసం అర్థం లేని మాటలను ఆశ్రయిస్తుందనడం, ఉపోద్ఘాతాలు, ప్రశంసలు, పరిచయాలు సమీక్షలలో ముందుగా ఆయా గ్రంథాలలో దోషాలన్నీ పేర్కొనవలెననడం, సంస్కృతంలోని సర్వకావ్య వాఙ్మయం, శాస్త్ర వాఙ్మయం తెలిసి ఉంటేగాని చిత్త పరిపక్వఫలప్రదమైన సాహిత్య కృషికి ఆస్కారం లేదనడం విచారణీయాలు, విచింత్యాలు. తీవ్ర వాద ధోరణికి ఉదాహరణలు. శ్రీ కృష్ణదేవరాయలు విదేశీయుడనటం ఆయన తెలుగు నాట దుర్గాలను జయించడం పొగడకూడదనటం, మనుమసిద్ధి మనవాడు కాదనటం, కాటమరాజు కథ తెలుగు వారికి ఉత్కర్షాపాదకం కాదనడం, విష్ణు సహస్రనామాల్లో చాణూరాంధ్ర నిషూదనః' అని వుంది కాబట్టి అది తెలుగు వారికి ఆత్మన్యూనతా పాదకం అనడం విపరీత ధోరణులు. ఉమాకాంతంగారి విమర్శలో ఇటువంటివి అక్కడక్కడ కనపడతాయి. ఆయన మహావిద్వాంసుడు కాబట్టి ఆయన అభిప్రాయాలేమిటో, ఆలోచన ధోరణి యేమిటో సగౌరవంగా తెలుసుకోవచ్చు కాని అవి త్రికాలా బాధితమైన సత్యాలనుకోవలసిన పని లేదు. స్మృతి గ్రంథాలే ఆయా కాలాలను బట్టి మారిపోతూ ఉండగా ధర్మ శాస్త్రాలే సవరణలకు లోనవుతూ ఉండాగా అందరూ వాల్మీకి వ్యాస కాళిదాసులవంటి పరమోదాత్త ప్రతి భావంతులను మాత్రమే ఆదర్శంగా ఉంచుకొని రచనలు చేయాలనడం అందుకోలేని ఆదర్శం అనుకోవలసి వస్తుంది. సంఘంలో పతనాభ్యుత్థానాల వలె, ఒడిదుడుకులవలె, విపరిణామాల వలె, అభిరుచులవల్ల ఆయా కాలాల సాహిత్యంలో కూడా మంచి చెడులు ఉంటూనే ఉంటాయి. 'చక్రనేమిక్రమం' అన్నాడు కదా కాళిదాసు. కృత యుగం ప్రాశస్త్యం అంగీకరించవచ్చు. దాని గొప్ప తనాన్ని స్తుతించవచ్చు గాని కృత యుగంలో మాత్రమే జీవన సార్థక్యం సమకూరుతుంది అంటే ఎట్లా ? ఆ కృతయుగంలో కూడా ఎన్నో ఘర్షణలు, కలహాలు, శాపాలు, కోపాలు, రాక్షస విజృంభణం వర్ణితమైనాయి కదా! ఎంతో వినాశనం కూడా జరిగింది కదా! అట్లానే ఆయా కాలాల సాంఘిక స్వరూపం సాహిత్యంలో ప్రతి ఫలిస్తూ ఉంటుంది. అని ఉమాకాంతం గారికి తెలియదా? తెలుసు అందువల్లనే ఆయన కొత్త

ప్రక్రియలను చేపట్టారు. వ్యావహారిక భాషా వాదాన్ని ఆదరించారు అనుసరించారు. 'నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి' అంటే వొప్పుకోలేదు. మనుస్మృతి గదా శిరోధార్యం అనుకోలేదు.

ఉమాకాంత విద్యాశేఖరుల విమర్శలో ముఖ్యంగా కనపడేది ఏమంటే ఆర్జవం ఆ ప్రతి హతమైన వాద విధానం. వేగవంతమైన శైలి. ఎటువంటి మొగమాటం లేకపోవడం. కందుకూరి వీరేశలింగం పంతులుగారిని ఆయన బసవేశ్వరుడితో పోల్చారు. ఆయన పట్ల అతివేలమైన గౌరవ ప్రతిపత్తి కనపరచారు.

ఉమాకాంతంగారి జీవిత కాలంలోనే వారి విమర్శలకు పండితులు సమాధానాలు చెప్పే ప్రయత్నం అసలు జరగకపోలేదు. వేటూరి ప్రభాకర శాస్త్రి గారికీ వీరికీ శాబ్దిక విషయకమైన చర్చ కొంత జరిగింది. ఆధునిక కవిత్వాన్ని ముఖ్యంగా భావ కవిత్వాన్ని ఉమాకాంతం గారు తీవ్రంగా అధిక్షేపించడం పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారు నవ్య సాహిత్య పరిషదధ్యక్షోపన్యాసంలో ఆక్షేపించారు.

ఉమాకాంత విద్యా శేఖరులు లౌకిక ప్రయోజనాల కోసం ఎవరినీ లక్ష్యపెట్టినట్లు కనపడదు. గుంటూరు జిల్లా కలెక్టరు రూథర్ ఫర్డు తనకు తెలుగులో తగిన పరిజ్ఞానం ఉన్నదని ధ్రువీకరణ పత్రం ఇవ్వవలసిందిగా ఉమాకాంతంగారిని అర్థిస్తే అందుకు విద్యాశేఖరులు నిరాకరించినట్లు చెపుతారు ఆ కుటుంబంలోని వారు. అల్లూరి సీతారామరాజు మన్యం తిరుగుబాటు సందర్భంగా దమనకాండ సాగించిన వాడు ఈ రూథర్‌ఫర్డు. అప్పట్లో రెండుసార్లు ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్ష బాధ్యత నిర్వహించడమే కాక విద్యావేత్తగా ప్రభుత్వంలో పలుకుబడి ఉన్నవారు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి. శాసన నిర్మాణ సభలో కూడా ఆయన సభ్యుడిగా పేరు ప్రతిష్ఠ లార్జించినవారు. అయినా ఉమాకాంతంగారు శ్రీ రామలింగారెడ్డి నవ్యసాహిత్యాన్ని గూర్చి భావకవిత్వాన్ని గూర్చి ప్రసిద్ధుల కావ్య సంపుటాలకు కూర్చిన పీఠికలను విమర్శించారు. వెంకటగిరి రాజా వారు రామాయణ మహాభారతాలను గూర్చి వ్రాసిన గ్రంధానికి శ్రీ రామలింగారెడ్డి పీఠిక వ్రాయగా శ్రీ రెడ్డి అభిప్రాయాలను తీవ్రంగా అధిక్షేపించారు ఉమాకాంతంగారు. శ్రీ వేదం వెంకట్రాయ శాస్త్రి గారి ఆముక్తమాల్యద సంజీవని వాఖ్య ఆవిష్కరణ తెలుగు దేశ వాఙ్మయ పత్రికలో విమర్శించారు. ఆ సభకు అధ్యక్షత వహించిన శ్రీ కట్టమంచి వారి అభిప్రాయాలనుకూడా శ్రీ ఉమాకాంతంగారు ఖండించారు.

ఉమాకాంతంగారు చాలా మనస్వి. ఆయన తన స్వగ్రామంలో వాగ్దేవీభవనం పేరిట ఒక గ్రంధ భాండాగారం నెలకొల్పాలనీ తమ ఆస్తిని దైవధర్మ కావ్యాలకు తమ పుస్తక వ్యాపకానికే వినియోగించాలనీ తమ వీలు నామాలో రాశారు. ఈ విధంగా మాచెర్లకెన్నకేశ్వరస్వామి ఆలయంలో ఉత్సవాలకు తమ ఆస్తిని కొంతరాసి ఇచ్చారు. మద్రాసు విశ్వవిద్యాలయ

పరిధిలోని ప్రెసిడెన్సీ కళాశాలలో ప్రతి సంవత్సరం సంస్కృతంలో ఉత్తమ స్థానం సంపాదించే విద్యార్థికి పారితోషికం నెలకొల్పారు. ఈ ఏర్పాటు కాయన Lakshmi-Varalakshmi Endowment Fund అని నామకరణం చేశారు. ఒకరి తరువాత ఒకరు చనిపోయిన ఆయన ఇల్లాండ్రు వీరిద్దరూ. 1942 ప్రెసిడెన్సీ కాలేజీ కేలండర్‌లో ఈ ఫండును గూర్చి ప్రస్తావితమైంది. (పుట 12)

ఆయన సాహిత్య విషయంలో ముక్కుసూటిగా పోయే వ్యక్తి అయినా ఆర్ద్రమనస్కుడు, మృదు స్వభావి అని వారిని తెలిసిన కుటుంబ సభ్యుల అభిప్రాయం. ఒకసారి ఒంటెద్దు బండిలో బంధువుల గ్రామానికి ప్రయాణం చేస్తుండగా చీకటి పడగా దొంగలు బండిని చుట్టుముట్టారనీ ఆయన నిర్వికారంగా పట్టుబట్ట మాత్రం తీసుకోకుండా తక్కినవన్నీ తీసుకొని పొమ్మన్నారనీ 'పట్టుబట్ట' పేరుతో ఒక గేయగాథను తల్లావఝ్ఝుల శివశంకర శాస్త్రి గారు ప్రచురించారు. ఈ రచన స్రవంతి సాహిత్య మాస పత్రికలో వచ్చింది.

శ్రీ ఉమాకాంతానికి సంస్కృతం అంటే చాలా ఇష్టం. కుటుంబంలో విద్యావంతులందరినీ ఆయన సంస్కృతం చదువుకోవల్సిందని ప్రోత్సహించేవారు. చిన్నతనంలో ఆయన సంస్కృతం నేర్చుకోవడానికి స్వగ్రామానికి పదెనిమిది మైళ్ళ దూరాన ఉన్న జానపాడు అనే ఊరు వెళ్ళేవారు. గుంటూరులోని హిందూ పాఠశాలలో వారు మాధ్యమిక పాఠశాల తరగతులు చదివారు. జాతీయోద్యమంలో ప్రముఖంగా పాల్గొన్న శ్రీ నల్లపాటి హనుమంతరావుగారు ఉమాకాంతంగారికి పాఠశాల తరగతులలో సహాధ్యాయి. సుప్రసిద్ధ పత్రికా రచయిత జాతీయోద్యమ ప్రవర్తకులు, ఆతర్వాత బందరు జాతీయ కళాశాల ప్రధానాచార్యపదవి చేపట్టినవారు ఉత్తమ సంస్కృతి పరుడు శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావు కూడా గుంటూరులో శ్రీ ఉమాకాంతంగారికి ఉన్నత పాఠశాల తరగతుల సహాధ్యాయి. ఉమాకాంతంగారు ఉన్నత పాఠశాలలో చదువుతున్న రోజులలో ఆనాటి సాహిత్య వాతావరణ ప్రభావితులై గుంటూరు ఫస్టు కంపెనీ హాలులో శతానధానం చేశారని ఆయన సమకాలికులన్నారు. పృచ్ఛకులు దొరకకపోతే చీటీలపై ప్రశ్నలు వ్రాసి తామే ఆ శతవధాన్ని నిర్వహించినట్లు భోగట్టా. పాఠశాలోపాధ్యాయులు ఆయన పట్ల చాలా గౌరవాభిమాన వాత్సల్యాలు చూపే వారని తెలుస్తున్నది. ఉన్నత పాఠశాలోపాధ్యాయులైన శిష్టుకాంభాట్లుగారు ఉమాకాంతం గదికి వచ్చి ఉమాకాంతంగారి పుస్తకాలన్నీ సక్రమంగా సర్దిపెట్టే వారుట. ఉమాకాంతంగారు ఆ రోజుల్లో సుప్రసిద్ధ సంస్కృత విద్వాంసులైన శిష్టాసీతారామ శాస్త్రి గారి వద్ద సంస్కృతం అధ్యయనం చేశారు. వీరు ఆ రోజుల్లో గుంటూరులో ఉండే వారేమోననిపిస్తున్నది. శిష్టా సీతారామ శాస్త్రిగారి దగ్గర తాము చదువుకున్నట్లు తల్లావఝ్ఝులవారు చెప్పుకున్నారు. శిష్టావారిది జానపాడు స్వస్థలం కావచ్చు. నేటి కాలపు కవిత్వంలో తమ ఆచార్య వర్గాన్ని స్మరిస్తూ ఉమాకాంతంగారు

"శిష్టాన్వయ సంజాత, సీతారామ విపశ్చితః, గురు పాదాః సదా ప్రేమ్ణా, వర్తన్తాం హృదయేమమ'
అని తమ గురు భక్తిని వెల్లడించుకున్నారు.

ఏది ఏమైనా ఉమాకాంత విద్యాశేఖరుల ప్రభావ శీలమైన వయసు నాటికి జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్నది. విజాతీయులు, విదేశీయులు భారతీయ సంస్కృతికి విఘాతం కలిగించారనే ఆక్రోశం బలపడింది. భారతీయ సంస్కృతి, సంస్కృతం పునరుద్ధరణం చెందాలనే తపన బయలు దేరింది. "ఇంగ్లీషు చిల్కావు వచియింపనేర్తువె? బలా! చిరకాలపు రామ శబ్దమున్" అన్నారు మహాకవి జాషువ. ఆయనే ఇంకా ఇట్లా ప్రబోధించారు.

"నాగజెముడు పురుగులాగున నీ చుట్టు
మూగియున్న నేటి నాగరకత
తెనుగుదనము తోడదినివేయదే నీయ
శీలతాంతములను, వాలకమును"

అది ఆనాటి జాతీయ చిత్తవృత్తి.

తెలుగు విశ్వవిద్యాలయం వారు శ్రీ ఉమాకాంత విద్యాశేఖరుల పల్నాటి వీర చరిత్ర పీఠికను ఈతరం సాహిత్య జిజ్ఞాసువుల నిమిత్తం పునర్ముద్రించడం అభినందనీయం. వారి వంశానికి చెందిన నన్ను వారి గూర్చి పరిచయం చేయవలసిందిగా కోరినందుకు విశ్వవిద్యాలయం వారి పట్ల ఎంతో కృతజ్ఞుణ్ణి.

ఇతినమ్.

హైదరాబాద్
10-4-96

అక్కిరాజు రమాపతిరావు

**To**

# THE SACRED MEMORY OF THE DEPARTED SOULS

**of**

SRI KOVVŪRI CANDRĀ REDDI VĀRU,

SRI VYDYA RATNA PANDIT D. GOPĀLĀCĀRYULU

SRI KOMARRĀJU LAKSMANA RAO ,, M.A.,

SRI DEWĀN BAHADUR NEMALI PATTĀBHI-RĀMA RAO ,, B.A.,

SRI JUSTICE T. V. SESAGIRI IYER AVL.,

As a token of reverence for their love of the advancement of culture and learning in the Vernaculars.

# అధికారినిరూపణం.

కాళిదాసాదుల ఉత్తమకావ్యాలు పఠించి, శాస్త్రపరిచయం, సాహిత్యవిచారణలో ఆవశ్యకప్రజ్ఞ, మహాపురుషారాధనతత్పరత్వం కలిగి ఇతిహాస జిజ్ఞాసువులైనవారు ఈకృతిశ్రవణమందు పూర్ణాధికారులు. తక్కినవారికి ఉపదేశాన్ని అనుసరించి బోధోపలబ్ధి. కేవలం వినోదంకోసం వినేవారు అధమాధికారులు.

# ద్వితీయభూమికలోని సఙ్కేతాక్షరవివరణం.

अ = अर्थशास्त्रम्
अष्टा = अष्टाध्यायी
अ = अहोबलपण्डितीयम्
ఆ = ఆదిపర్వం
ఆం = ఆంధ్రకవులచరిత్ర
ఆం. చ = ఆంధ్రులచరిత్ర
ఆ. మ = ఆనందముద్రాలయమను చరిత్ర
उत्तर = उत्तररामचरितम्
ऋ = ऋग्वेदः
ऋ॰ भा = ऋग्वेदभाष्यम्
ए. ब्रा = एतरेयब्राह्मणम्
క. జీ = కవిజీవితములు
का = काव्यप्रकाशः
का. पू = कादम्बरीपूर्वभागः
का. प्र. व्या = काव्यप्रकाशव्याख्या
కా. ఖ = కాశీఖండం
కృ. వి = కృష్ణరాయవిజయం
का. वि = कामकळाविलासः
కా. చూ = కావ్యాలంకార చూడామణి
कु. त = कुलार्णवतन्त्रम्
క్రీ. రా = క్రీడాభిరామం
क. रा = कलियुगराजवृत्तान्तः
का = कादम्बरी
कथा = कथासरित्सागरः
गी = गीता
च. व्या = चम्पूरामायणव्याख्या
ज. व्या =
J. A. O. S = Journal of the American Oriental Society.

त = तन्त्रवार्तिकम्
తి. భా. వి = తిక్కనభారతంలో విరాట పర్వం
तै = तैत्तिरीयब्राह्मणम्
ध्व = ध्वन्यालोकः
ద్రావి = ద్రావిడభాషలు
दश = दशरूपकम्
नै = नैषधीयचरितम्
ని = నిరంకుశోపాఖ్యానం
नागा = नागानन्दम्
प्र. च = प्रबोधचन्द्रोदयम्
प्र. य = प्रतापरुद्रयशोभूषणम्
प्र. बो. च. व्या = प्रबोधचन्द्रोदयव्याख्या
प्र. सा = प्रपञ्चसारतन्त्रम्
పా. జా = పారిజాతాపహరణం
पञ्च = पञ्चदशी
బా. గు. ప్ర = బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశిక
भ = भट्टभास्करभाष्यम्
भ. त्रि = भर्तृहरित्रिशती
भा. प्र = भवप्रकाशः
माल = मालविकाग्निमित्रम्
मधु. वि = मधुराविजयम्
మ. ను = మనుచరిత్ర
म. व = महाभारते वनपर्व
म. उ = महाभारते उद्योगपर्व
म = मनुस्मृतिः
महा = महाभाष्यम्
मेघ = मेघदूतम्
म. स = महाभारते सभापर्व

म. वि = महाभारते विष्णुसहस्रनामस्तोत्रम्
मू = मूकपञ्चशती
मालती = मालतीमाधवम्
रत्ना = रत्नावळी
रा. कि = रामायणे किष्किन्धाकाण्डम्
रघु = रघुवंशम्
रा. बा = रामायणे बालकाण्डम्
रा. यु = रामायणे युद्धकाण्डम्
ल. स = ललितासहस्रनामस्तोत्रम्
వ. చ = వసుచరిత్ర
वा. का = वत्स्यायनकामसूत्रम्
వై. వి = వైజయంతీ విలాసం
वै. सि. म = वैयाकरणसिद्धान्तमञ्जूषा

विक्र = विक्रमाङ्कदेवचरितम्
शु = शुक्रनीतिः
शु. य = शुक्लयजुर्वेदः
श. ब्रा = शतपथब्राह्मणम्
श्री. भा = श्रीभागवतम्
श्री. गु = श्रीगुणरत्नकोशः
श्री. भा. न = श्रीभागवते नवमस्कन्धः
సభా = సభాపర్వం
సం. లో = సంస్కృత లోకోక్తులు
सा = साहित्यदर्पणम्
सौ = सौन्दर्यलहरी
हर्ष. च }
ह. } = हर्षचरित्रम्

**ओ३म्.**

**परमात्मने नमः.**

# వీరచరిత్ర ద్వితీయభూమిక.



1. **धर्मस्य स्थितये त्याग मपि सर्वस्य कुर्वतः ।**
**महावीरस्य तेजांसि वसेयुः पुरतो मम ॥**

2. పద్మ, వాణి, మహీధరాత్మజ,
అని నుతింతురు విబుధు లెవ్వరి
ఆజగచ్చైతన్యదాయిని
చరణములకు నమస్కృతి.

3. రోహిత ప్రహ్లాదముఖ్యులు
బాలవీరులు తొల్లి తా నని
బాలు డాలోకించు వీరుల
వృత్తిధార గణించెదన్.

4. కామభూపాలసుత, అనపోతుభార్య,
దుర్గిలక్ష్మి, సతీధర్మమహిమములను
వ్యక్తమొనరించినట్టి పల్నాటిసీమ
పుణ్యభూముల వెలుగు వర్థిల్లుగాక.

5. కావ్యపరీక్షాప్రజ్ఞావంతుల
దండి వర్ధనుని అభినవగుప్తుని
రాజశేఖరుని మమ్మటాద్యులను
తద్వచోఽర్థబలసిద్ధికి తలతున్.

6. మదినినిల్పి ప్రతాపరుద్రీయకర్త,
సూరి, వేముల, సింగు, నాదెండ్ల గోపు,
పేరుభట్టాత్మజుని, పురావిదుల నెంచి,
కూర్తు భూమిక వీరచారిత్రమునకు.

ఇక ఈ వీరచరిత్రను నేను మొదట 25 సంవత్సరాల క్రిందట ప్రకటించాను దీనికి. నాలుగు గ్రంథాలు నాకు లభించినవి. ఒకటి కథాశేషులైన శ్రీ అక్కిరాజు శంకరనారాయణవారు నైజాంనుండి తెప్పించి యిచ్చినది. రెండవది క. శే. శ్రీ జానపాటి వేంకటఅప్పయ్యవారివల్ల లభించినది. మూడవది క. శే. శ్రీ పిడుగు వీరభద్రఅయ్యవారిచ్చినది. వీరు వీరమతపీఠానికి ఆచార్యులు. నాల్గవది క. శే. చల్లగుండ్ల పిచ్చయ్యవారు వ్రాయించి పంపినది. వీట్లో బాలచంద్రయుద్ధం నైజాంగ్రంథంలో మాత్రమే సమగ్రంగా వున్నది. తక్కినవి కథాంశాలు గ్రహించడానికి తోడ్పడ్డవి.

## మార్పులు.

మొదటిసారి ముద్రితమైన పల్నాటివీరచరిత్రలోవున్న అరసున్నాలు, బండిరాలు, భాషాప్రవాహంలో లేని అనావశ్యక గజడదబనలు మొదలైనవి, నేను చేర్చినవేను. ఇవి మూలగ్రంథంలో లేవు. ఇవి లేకుంటే తెలుగుగ్రంథం కాదనుకొనేదశలో ఛాందసమార్గాన్ని అనుసరించి వాటిని చేర్చాను. ఈ అకార్యానికి ప్రాయశ్చిత్తరూపంగా వాటి నిప్పుడు తొలగించాను. మొదటిపీఠికలోను, వ్యాఖ్యలోను, పూర్తిచేసిన పట్టుల్లోను, అప్పటి అరసున్నాలు మొదలైనవి నావి గనుక వాటిని అట్లానే వుంచాను.

## వీరకాలనిర్ణయం.

నేను చేసిన వీరకాలనిర్ణయమే పిమ్మటివారు గ్రహిస్తూ వచ్చారు. ఈవిషయంలో చేయదగిన మార్పేమీలేదని అనుకొంటున్నాను. మొదటిపీఠికలో నేను ఉదాహరించిన హైహాయసంబంధి సంస్కృతశాసనాలు ఇండియన్ ఆంటిక్వెరి పత్రికలోనివి. మాచెర్ల కారెంపూడి శాసనాలు బెజవాడ దుర్గామల్లేశ్వరస్వామి ఆలయంలోని శాసనం నేను స్వయంగా చూచి వ్రాసుకొన్నవి. తక్కిన వన్నీ సూయల్ పట్టికనుండి, తాళపత్రపుస్తకాలయంలోని శాసనసంచయం నుండి, తీసుకొన్నాను. అక్కడక్కడ నేను తెలిపిన స్థలనిర్దేశాదులు

సూయల్ పట్టికనుండి, చోళచాళుక్యరాజ్యపరిపాలనాబ్దాలు సూయల్ పట్టికనుండి ఆధునికేతిహాసగ్రంథాలనుండి స్వీకరించాను.

## శ్రీనాథుడిదేశం.

శ్రీనాథుడు కర్ణాటుడు. శ్రీనాథుడు కర్ణాటదేశస్థుడని నేను సకారణంగా ప్రథమపీఠికలో విశదపరచాను. అప్పటినుండి దానికి శ్రీ చిలుకూరి వీరభద్రరావు వారు యింకా మరికొందరు ప్రతికూలత కనబరచారు కాని నేను చూపిన ప్రమాణాలను అన్యథాకరించలేదు. శ్రీ పెద్దిభట్ల వీరయ్యవారు తమ ఓరుగంటివిచారణలో దీన్ని తటస్థులుగా ప్రస్తావించారు. ఉపపత్తులతో ఈఅంశం స్పష్టపరచాను. శ్రీనాథుడు కర్ణాటదేశస్థుడని యిప్పటికీ భావిస్తున్నాను. శ్రీనాథుడితో సంబంధం వున్నా లేకున్నా కన్నడీలని ఒకబ్రాహ్మణశాఖవారు ఇప్పటికీ పల్నాటిసీమలో కరాలపాటిగ్రామంలో వున్నారు.

ఇట్లానే నన్నయకూడా అనాంధ్రుడుగా కనబడుతున్నాడు. ఆంధ్రదేశాన్ని జయించిన చాళుక్యులకు, చోళులకు బంధుత్వ మేర్పడినకాలంలో యితడు అరవదేశంనుండి వచ్చి వుండవచ్చును. ఆంధ్రదేశానికి చోళసంబంధం కలిగిన సమయాన ద్రవిడులు కొంద రిక్కడికి వచ్చినట్లు కనబడుతున్నది. తంబళులు (తమిళులు) అట్లాటివారే నని అనుమేయం. అప్పయ్యదీక్షితులవారి, తాంత్రికమీమాంసకు విషయమయిన వారిలో వీరుకూడా చేరివుంటా రని అనుకొంటున్నాను. యెరకలు లేవిధంగా వచ్చారో ఇప్పటికి అరవమే మాట్లాడుతున్నారు. ఆరామద్రావిడులు మొదలయినవారి సంగతి విదితమేగదా. ఇతడు శ్రీనాథుడివలె దేశంలో చిరకాలనివాసంగల వంశంలోనివాడు కాక అప్పుడప్పుడే వచ్చి చేరినవాడో అట్లా చేరిన ద్రావిడకుటుంబానికి చెందినవాడో అయివుండవచ్చును. కనుకనే తనభాష అయిన అరవంలోని మాటలను అనావశ్యకస్థలాల్లోకూడా తప్పించుకొనజాలని దశలో వుండినట్లు కనబడుతున్నది. ఇతడు వాడిన శబ్దాలు కొన్ని ఆంధ్రదేశపు వ్యవహారంలో లేకపోవడమే కాకుండా తమిళదేశంలో యిప్పటికీ సాధారణజనుల్లోకూడా వాడుకలో వున్నవి.

| | శబ్దం | అర్థం | నన్నయరూపం | అరవదేశపు ఇప్పటి వ్యవహారం | తెలుగుదేశపు ఇప్పటి వ్యవహారం |
|---|---|---|---|---|---|
| 1 | యును... | సముచ్చయార్థకం | ఆత్మహానియున్ విలువిద్యయుంగఱచి. (ఆది) వారిధియుం గలంగె (సభా) | ఎలియుం, పూనైయుం (యెలకా, పిల్లీ) | లేదు |
| 2 | ఎల... | లేత... | ఎలజవ్వనంబు (ఆది) | ఎళంగీరె (లేతకూర) | లేదు |
| 3 | తొట్టి | మొదలుకొని | హిమకరుదొట్టి యదువుదొట్టి (ఆది) | పొరందదు తొట్టు (పుట్టింది మొదలు) | లేదు |
| 4 | కఱచు | నేర్చు | విలువిద్యగఱచుచుండిరి (ఆది) | ఎనక్కఱ్త్తుకుడు (నాకు నేర్పు) | లేదు |
| 5 | అరయు | తెలియు | పొరయకుండ నరసి (ఆది) | నన్నా అరింజి (బాగా తెలిసికొని) | లేదు |
| | ఆరయు | పరిశీలించు | ఆరసి మేలునా (ఆది) | నన్నా ఆరాయ్ (బాగాపరిశీలించు) | లేదు |
| 6 | పెర్మి | గొప్పతనం | మహీశుల పెర్మిఁ జేసి (ఆది) | భగవానుడయ పెరుమై కాట్టత్తుకు (భగవంతుడి గొప్పతనం చూపడానికి) | లేదు |
| 7 | మనము | మనస్సు | మనమునఁ జెయ్వుల మాటల (ఆది) | ఎనక్ మనం వరాదు (నాకు మనసురాదు) | లేదు |
| 8 | పోలె | వలె | జలకణంబులపోలె(ఆది) | తంగంబోలె యిరికి (బంగారంవలె వున్నది) | లేదు |

ఇక జవంబు, కర్ణుండు, తెనుంగు, జందనగంధి, బ్రభాతము అని యిట్లా నన్నయవుపయోగించినట్టి, యిప్పటి తెలుగు వ్యవహారంలో లేనట్టి పూర్ణబిందువులు, గజడదబలు, ంబులు, ండులు మొదలయినవి అరవభాషలో పాలుంజోరుం (పాలూఅన్నం), మూరుంజాదం (మజ్జిగా అన్నం), పూవుం బఱ్ఱముం, యెరంగు, పొరందు, తెలుంగు, కరండి, సున్నాంబు, నరంబు, పాంబు, ఒడంబు, నడంది, గూండు, వేండికోండు అని యీతీరున యిప్పటికీ ప్రభూతంగా ప్రసిద్ధంగా వ్యవహృతమవుతున్నవి. ఈతమిళశబ్దాలు నేనుసంభాషణలో గ్రహించినవి.

పైన వుదాహరించబడిన శబ్దాలు స్వల్పరూపభేదంతో ప్రకృతపు కన్నడ వ్యవహారంలోను కనబడుతున్నవి. అందం, గుఱ్ఱం, వనం, కోపం, అని యిట్లాటిశబ్దాలు తెలుగులో హలంతాలైవుంటే 'క్రమము', 'జనము' 'గణము', 'తీర్థము' అని ఆవర్గంలోని వీటికి నన్నయోక్తిలోవున్న అజంతరూపం 'జలవు' 'బలవు', 'తీర్థవు' అని తద్గణస్థాలకు కన్నడంలో నేటికీ వ్యవహారంలో వున్నది. "ఫలం" 'జలం' 'ఇహం' లేదా "ఫలమూ" 'జలమూ' 'ఇహమూ'అని వీటికి తెలుగులో సముచ్చయార్థకరూపం వుంటే "మహారవముఁ .............. ఘోషముఁ;" "ఇహముం బరంబు" "మహోత్సవమున్;......... సాంగత్యముఁ" అని ఆకోటిలోనివాటికి ఆఅర్థంలో నన్నయకూర్చిన అనునాసికాంతమైన ఉత్తు "జలముం" "పఱ్ఱముం", "(నీళ్లూ పండూ)", అని ఆగణంలోనివాట్లో అరవంలో, ఇప్పటికీ వ్యవహృతమవుతున్నది. ఇదివరకు చెప్పినట్లు ఇతడు తమిళుడో చాళుక్యుల ప్రధాన నగరమైన కళ్యాణపు ప్రాంతాలనుండి వచ్చిన కర్ణాటుడో అయివుంటాడని వ్యక్తమవుతున్నది. పైన జూపిన శబ్దాలు, శబ్దరూపాలు నన్నయకాలంలో తెలుగులో వ్యవహృతమై ఇప్పుడు లుప్తమైనవేమో, ఇతడు ఆంధ్రుడే అయి ద్రవిడకర్ణాటభాషలు చదివి వుండడంవల్ల పరిచయవశాన ఆమాటలు వాడినాడేమో అనే యిట్లాటి పూర్వపక్షాలను విచారించక వదలుతున్నాను. ప్రవాహిభాషల్లో కొన్ని శబ్దాలచ్యుతి నిజమే

అయినా అవి మన మనుకొనేటంత తేలికగా నశించడంమాత్రం అసత్యం. దాదాపు వేయిసంవత్సరాలక్రిందటి నన్నయశబ్దాలు, శబ్దరూపాలు ఇప్పటికీ తమిళభాషలో వుండడమే దీనికి నిదర్శనం. నన్నయ పేరుకూడా అనాంధ్రమేను. నన్న అంటే అరవంలోను కన్నడంలోను మంచి అని అర్థం. ఇది తెలుగులో లేనేలేదు. ఇతడు ఆంధ్రుడై అరవం, కన్నడం చదివినవాడనుకొంటే తనపేరుకూడా ఆభాషల్లోకి మార్చుకొనడుగదా. ఈతీరుగా శ్రీనాథుడు నన్నయ అనాంధ్రులు కావడం మనకు అగౌరవహేతువని చింతించవలసిన పనిలేదు. ఆంధ్రేతరులు కూడా తెలుగులో గ్రంథకరణానికి యత్నించారనడం ఆంధ్రులకు గర్వహేతువే కాగలదు. అనాంధ్రభాషల సంప్రదాయాలు తెలుగులో పెట్టడం, మార్చిమార్చక అనాంధ్రశబ్దాలనువాడడం శబ్దానుశాసనమని యితడు భావించివుంటే అది అసంబద్ధమని భారతీయవైయాకరణసంప్రదాయవిరుద్ధమని మాత్రం చెప్పి ప్రస్తావవశాన వచ్చిన యీవిచారణ యిక చాలిస్తున్నాను.

## వీరచరిత్ర.

పల్నాటివీరచరిత్ర కొన్ని మహాప్రబంధలక్షణాలుగల మూలగ్రంథం. నన్నయభారతాదులవలె అనువాదంగాని, హంసవింశత్యాదులవలె క్షుద్రవృత్తబాహుళ్యంగల పుక్కిటిపురాణంగాని, మనుచరిత్రాదులవలె పూర్వకథావిశిష్టంగాని, కానటువంటి ఒక అపూర్వకృతి.

## ప్రబంధశబ్దం.

మనువసుచరిత్రాదులు ప్రబంధాలని తక్కినవి కావని కావ్యాలు వేరని తెలుగుదేశంలో తెలుగుపుస్తకాలు చదివే మనలో అనేకులు అనుకొంటున్నారు.

> "ఈతఁడే... మొట్టమొదట మనుచరిత్రమును బ్రబంధరూపమున రచియించిన కవియగుటచేత..." (ఆం. క. చ.)

అని శ్రీకందుకూరి వీరేశలింగంవారు.

# ప్ర బం ధ శ బ్దం.

"ఈతనికిఁ బూర్వులగు పురాణకవులును, కావ్యకవులును నొనరింపని ప్రబంధ కవనమునకుఁ గ్రొత్తత్రోవ లీతఁడు కల్పించుటంజేసి" (క. జీ.)

అని శ్రీగురుజాడ శ్రీరామమూర్తివారు.

"కావ్యప్రబంధ కవిత్వము."

అని ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహకర్త.

మనుచరిత్రతో ఈ ప్రబంధాలు ఆరంభమైనవని ఒకచోట పిల్లలమర్రి పినవీరన్నతో ఆరంభమైనవని ఒకచోట, యిట్లా ప్రతిపాదిస్తున్నారు. ఇవి సాహిత్యసంప్రదాయం తెలియనిమాటలు. ప్రబంధమంటే కావ్యమే కాని విశేషార్థమేమీ లేదు. రామాయణ భారతాదులు కూడా ప్రబంధాలేను. ప్రబంధాలు మనుచరిత్రాదులతో ఆరంభమైనవనే వారిపట్టులు కొద్దిమార్పులతో అట్లాటివి మరికొన్ని వాక్యాలు, అమరుడి నిర్వచనం, విద్యానాథాది సాహిత్యవేత్తల వచనాలు, ఆళ్వారులస్తోత్రాలను దివ్యప్రబంధమనడం, అనువాదాలనుండి వేరుచేయడానికి ఇది విశేషనామ మనడం, మనుచరిత్రాదులు కొత్తరకం గనుక వేరే పేరు ఆవశ్యకమనడం, నామైకదేశవాదం, దండిచెప్పిన వర్ణనల విషయం, యివన్నీ పూర్వపక్షసమాధానాలతో ఇక్కడ విచారించక వదలుతున్నాను. ప్రబంధం, కావ్యం, పర్యాయపదాలని, విశేషమేమీ లేదని, రామాయణమహాభారతాదులు, రూపకాలు, ప్రబంధాలే నని, అందుకే

"प्रबन्धे च अङ्गी रस एक एव उपनिबध्यमानोऽर्थविशेषलाभं, छायातिशयं च पुष्णाति कस्मिन्निवेति चेत् यथा रामायणे यथा वा महाभारते." (ध्व.)

అని ఆనందవర్ధనుడు,

"प्रबन्धेऽप्यर्थशक्तिभूः
यथा गृध्रगोमायुसंवादादौ." (काव्य.)

అని మహాభారతంలోని శాంతిపర్వస్థమైన గృధ్రగోమాయుసంవాదాన్ని వుదాహరిస్తూ మమ్మటుడు,

**"प्रथितयशसां भासकविपुत्रसौमिल्लकादीनां प्रबन्धानतिक्रम्य वर्तमानकवेः कालिदासस्य क्रियायां कथं परिषदो बहुमानः ॥" (माळ)**

(ప్రథిత యశస్సుగల భాసకవిపుత్ర సౌమిల్లకాదుల ప్రబంధాలను అతిక్రమించి వర్తమానకవి అయిన కాళిదాసుడి రూపకమందు పరిషత్తుకు యెట్లా ఆదరం వుంటుంది?)

అని కాళిదాసు, వాటి ప్రబంధత్వం విదితం చేశారని, వ్యవహారమనేది సమీచీనమైతే తప్ప స్థితిమాత్రానే ఉపాదేయం కాదని, అది అనుచితమైనప్పుడు హేయమని, అనువాదాలను అనువాదాలనే అనవచ్చునని, కావ్యానికి సాధారణమైన నూతనత్వాన్నిబట్టి మాత్రమే విశేషనామ మేర్పరిస్తే కల్పనాగౌరవం సంభవిస్తుందని, రసభావ నిష్పాదన విధానభేదాన్నిబట్టి విశేషనామం వుండవచ్చునని, అది లేనప్పుడు కొంత కల్పన, కొంతపూర్వకథగల రఘువంశాదులకు వలెనే మనుచరిత్రాదులకు విశేషనామ మావశ్యకంగాదని, ఒకవేళ ఆవశ్యకమని ఒప్పుకొన్నా వాటికి ప్రబంధమనే విశేషనామం ఉద్దిష్టార్థాన్ని తెలపడానికి సమగ్రంగా సమర్థం కాకపోవడమే కాకుండా భ్రాంతిజనకం కూడా కావడంవల్లను అజ్ఞానసూచకంగా వుండడంవల్లను త్యాజ్యమని, రామాయణాదులు ప్రబంధాలు కావని అనుకోనడం శబ్దార్థవివేకశూన్యత్వద్యోతకమని, సిద్ధాంతంమట్టుకు తెలుపుతున్నాను.

గురిజాలకోడిపోరునుండి చివరవరకు గల ఇతివృత్తం శాఖావంతమై విస్తృతమైనది. మహావీరుల ఇతిహాసం కావడంవల్ల ప్రకృష్టం కూడా అయివున్నది. దీనికి నాయకుడైన మలిదేవరాజు, ప్రతినాయకుడైన నలగామరాజు, ముద్రారాక్షసమందలి చంద్రగుప్తుడివలె అంతగా క్రియాపరులు గానివీరులు ఇట్లాటివారికి సచివాయత్తసిద్ధులని వ్యపదేశం. అనపోతు, బాలచంద్రుడు, బ్రహ్మనాయుడు, అలరాజు, పేరినీడు,

కొమ్మరాజు, వీరందరు ఉదాత్త క్షాత్రధర్మమహితులై అవశ్యకమైన ప్పుడు ప్రాణాన్ని సయితం తృణప్రాయంగా, సమర్పించగలిగిన లోకోత్త రులు. బ్రహ్మనాయుడు, విష్ణువుయొక్క అవతారంగా భావించబడుతు న్నాడు. అయినప్పటికీ ఇతడి మానుషప్రవృత్త్యౌచిత్యాన్ని వీరచరిత్ర కర్త సమంజసంగా ప్రతిపాదించాడు. కుమారుడు రణరంగానికి వీపు చూపినందుకు అతడుచేసిన నింద భారతీయవీరతయొక్క ఉత్కర్షను నిజంగా ప్రకటిస్తున్నది. ఉత్తమ ధర్మపరాయణలైన వీరవనితలు ఇందు ప్రాధాన్యం వహిస్తున్నారు. యుద్ధభూమికి పోకుండా ఆపవద్దని కుమా రికి ఉపదేశించిన రేఖ, పతిచేతికి ఖడ్గమందిచ్చి విజయాశీస్సు లర్పించిన మాంచాల,లోకమందలి వీరవనితలకు ఆరాధ్యలుగా ఉండజాలినవారు. అల్లుణ్ని చంపినందుకు తండ్రిని నిందిస్తూ చితపై శరీరమర్పించి పరలో కంలో సయితం సేవించడానికి పతిని అనుగమించిన రత్నాలపేరిదేవి భారతీయ పత్నీధర్మంయొక్క బలోన్నతిని విదితం చేస్తున్నది. ప్రతి పక్షకోటిలోని నాయకురాలు రామాయణంలో మంథరవలెను, భారతంలో శకునివలెను అనర్థాలకుకారణం. నట్టింటి నాగుబాముని చింతపల్లిరెడ్డి ఆమెనుగురించి చెప్పినమాటలు యథార్థమైనవి. ప్రతి స్పర్థిలేకపోతే తనరొమ్మును తానే గుద్దుకొంటుందని కథకులు తరు చుగా చెప్పుతూవుంటారు. అయినప్పటికీ యీమెను ఒకగొప్ప మంత్ర పాటవంగల రాజనీతిప్రవీణనుగా వీరచరిత్రకర్త ప్రదర్శించాడు. యుద్ధారంభంలో చేసిన సంధియేర్పాట్లు యీమె నయకౌశలాన్ని తెలుపుతున్నవి. అనర్థాలతో స్త్రీలతో యెదుర్కొనవలసివుండడం వీర పురుషులకు దురదృష్టమని చెప్పవచ్చును. ఇట్లాటి దురదృష్టం బ్రహ్మ నాయుడికి సంభవించింది. అయినప్పటికి బ్రహ్మనాయుడు,

**"वृद्धो बालो न हन्तव्यो नैव स्त्री केवलो नृपः ।(स्मृ. अ ४ श्र ७.)**

(వృద్ధుణ్ని, బాలుణ్ని, స్త్రీని, సైన్యాదులు లేనిరాజును చంప గూడదు.)

అనే భారతీయధర్మాన్ని అనుసరించి పరాఙ్ముఖు డయినాడు. వీరత్వప్రసక్తి వచ్చినచోట్ల వీరచరిత్రకర్త ఉద్వేగాన్ని కనబరుస్తాడు. బాలచంద్రుడికి అతడి తల్లిదండ్రులకు జరిగిన సంవాదంలోను బాలచంద్రుడి తక్కిన సంభాషణల్లోను యీవిషయం వ్యక్తం కాగలదు. యుద్ధావసానపురాత్రి, కన్నమనీని అర్ధరాత్రపు రణరంగదర్శనం, ఇట్లాటి చోట్లవలె అతడు భయానకనిష్పాదనమందుకూడా కొంతకౌశలం కనబరుస్తాడు. తక్కినచోట్ల సాధారణదశను దాటలేదు. అక్షరాలతమాషాలో సగం మానినందువల్ల పోయినసగం పెంటగాక మిగిలిన చెన్నుగ, సగగ, చయ్యన, ఒయ్యన, పన్నుగ అనే యిట్లాటిదండగ్గణాం, భూమిగణం, ప్రకాశగణం, మొదలైన చెత్తను తీసివేస్తే కథనం ఆకర్షకంగాను, స్ఫుటంగాను, పటుత్వవిశిష్టంగాను ఉన్నట్లు విదితం కాగలదు.

ఆరంభంలో జీడినూనెగుడ్డలు ధరించి పాపవిముక్తికై అనుగురాజాదులు బయలుదేరడం, మధ్యన బాలచంద్రుడి వైరాగ్యోపదేశం, వృత్తావసానమందు ఉభయానికి వినాశం, బ్రహ్మనాయుడి ఉపదేష్టృత్వప్రతిపత్తి, వీటిఅన్నిటివల్ల మహాభారతంలోవలె ఇక్కడకూడా ప్రధానరసం శాంతమని వీరకరుణాదులు అంగరసాలని నిర్ణయించవచ్చును.

వైష్ణవులు నాలాయిరాన్నివలె దీన్ని వీరమతస్థులు ఔర్ధ్వదైహికాల్లో పఠనానికి వినియోగించడం దీని శాంతరసవత్త్వానికి అనుగుణంగా వున్నది. రామాయణాదులవలె కాక వీరచరిత్ర ఒకచే ద్విపదీపద్యంలోను, ఒకచేసరణిలోను వున్నది.

ఉగ్రం, ప్రసన్నం, మనోహరం, జుగుప్సితం, అద్భుతం యిట్లా వివిధంగావున్న ఖగోళమహీగోళప్రకృతుల్లోని వివిధరూపాలను రామాయణమహాభారతకుమారసంభవాదుల్లోవలె కథాపురుషులదశకు అనుగుణంగా ప్రదర్శించడం వీరచరిత్రలో అరుదు. యుద్ధావసానపు చీకటివర్ణనకూడా ప్రకృతంతో అంతగా సంగతం కాదు. రఘువంశం

ఆయువుపట్లయిన కథాఘట్టాలను నిర్మించడంలోగాని భావానికి ఉన్నతి, వికాసం కలిగించే అభిప్రాయాలను వ్యక్తీకరించడంలో గాని వీరచరిత్రకర్త సాధారణదశను అతిక్రమించలేదు. తెలుగుకృతుల్లో అనేకాల్లోవలెనే దీంట్లోను కథాతంతువే ప్రధానం.

అశ్వఘోషుడి బుద్ధచరిత్రం యితిహాసమైనా కవితావిషయాన వీరచరిత్రకంటె యెంతో ఉత్కృష్టమైనదిగా ఉన్నది. కేవలం తత్త్వవిచారణాసంబంధిఅయినా జ్ఞానవాసిష్ఠంలో విబుధారాధ్యమైనవి కవితాఘట్టాలెన్నో అక్కడక్కడాదృష్ట మవుతున్నవి. శ్రీనాథాదులు సరియైన అనువాదాలను నిర్వహించలేకపోయినారా అనేసంశయం కలుగుతున్నది. అవి అనౌచిత్యం పాలుగావడం స్పష్టం గనుక సంగ్రహాలనుకొంటే అసంగతప్రాసాదులతో కూడిన అనపేక్ష్యసంగ్రహాలని గాని లేదా పైన తెలిపినవిధాన అనుపాదేయమైన అనువాదాలని గాని చెప్పుతూ అవి అట్లాటిదశయం దుండడానికి యీక్రింది హేతువులను నేను సంభావిస్తున్నాను.

## ఉత్తమవిద్యాద్వారం.

తెలుగు యెప్పుడుగాని ఉత్తమవిద్యాద్వారంగా వుండలేదు. నన్నయకాలంనుండి మదరాసు విశ్వవిద్యాలయం వచ్చేవరకు విజ్ఞానప్రదమైన ఉత్తమవిద్యఅంతా సంస్కృతంద్వారానే విద్యాపీఠాల్లో అభ్యస్త మవుతూవుండేది. మద్రాసువిశ్వవిద్యాలయం వచ్చినతరువాత మనలో అనేకులు ఇంగ్లీషుద్వారా ఉత్తమవిద్య అభ్యసిస్తున్నారు. కనుక ప్రాచీనకాలంలోగాని యిప్పుడుగాని తెలుగు ఉత్తమవిద్యాద్వారంగావుండే ఉదాత్తప్రతిపత్తి పొందలేదు. ఉత్తమవిద్య అంటే బుద్ధిపరిణతిహేతువై విచారణాపూర్వకమైన విజ్ఞానం. విద్యాపీఠాల్లో సంస్కృతం ఆతీరున ఉదాత్తాధికారం వహించి వుంటూవుంటే "గాసటబీసటే చదివి" అని యెర్రాప్రెగ్గడ అన్నట్లు సంస్కృతం వచ్చీ రానివారు, దూడపేడ సంస్కృతంవారు, సంస్కృతం బొత్తిగా రానివారు యిట్లాటి అధమాధికారులకుమాత్రమే నన్నయాదుల కథల కృతులు

వుద్దిష్టమని నేను తలుస్తున్నాను. ఈదశ ఒక తెలుక్కే గాక కొంచెం హెచ్చుతక్కువగా ప్రాకృతభాషలకన్నిటికీ ప్రాచీనభారతవర్షంలో వుండేది. బుద్ధభగవానులు పాలీకి, మతభాషాగౌరవం, విజ్ఞానభాషా గౌరవం యిచ్చినప్పటికీ వైదికులు మాత్రం ఆమార్గాన్ని అంగీకరించ లేదు. మతవిషయాన కొన్నిఅంశాల్లో తమిళం ప్రాకృతంవంటిదని విదితం. ఈతమిళభాష చాలా ప్రాచీన కాలంనుండీ ప్రసిద్ధమైనట్లు కన బడుతున్నది. బాణుడు సయితం తనకాదంబరిలో ద్రవిడధార్మికవర్ణ నలో

"दिवसमेव मशकक्वणितानुकारि किमपि कम्पितोत्तमाङ्गं गायता स्वदेशभाषानिबद्धभागीरथीभक्तिस्तोत्रनर्तकेन... ... ... ... ...
जरद्द्रविडधार्मिकेणाधिष्ठितां......" (का. पू.)

(పగలంతా తలఆడిస్తూ దోమరాగంవంటిదేదో పాడేవాడు, స్వదేశభా షలో గంగాస్తోత్రం చేస్తూ ఆడేవాడు...అయిన ముసలిద్రవిడధా ర్మికుడు అధిష్ఠించిన...)

అని యీతమిళభాషను ప్రస్తావిస్తాడు. కుమారిల భట్టాచార్య లీభాషాశబ్దాలను ఉదాహరించారు.

"द्रविडाङ्गनोक्तवाचामिव" (प्र. च.)

(ద్రవిడాంగనల వాక్కులకువలె)

అని కృష్ణమిశ్రు లీభాషను స్మరించారు. పైనచెప్పినట్లు వైది కులు సంస్కృతానికి వుండే గౌరవాధిక్యాలను ప్రాకృతభాషలకు ఇయ్యడానికి సమ్మతించలేదు. పాలీవలె గాక మిత్రంగావచ్చిన తమి ళాన్ని సయితం వారు ఆదరదృష్టితో చూసినట్లు కనబడదు.

కూర్మపురాణకర్త

गायन्ति लौकिकैर्गानैः दैवतानि नराधिप ।
वामपाशुपताचारास्तथा वै पाञ्चरात्रिकाः ॥ (कू. अ. ३०.)

(ఓరాజా పాంచరాత్రులు వామపాశుపతాచారులు లౌకికగా నాలతో దేవతలను స్తుతిస్తారు.)

అని దేశభాషాత్మకమైన దైవస్తోత్రాలను కలియుగపు ధర్మవిప్ల వాల్లో విచారంతో ఉదాహరిస్తాడు. ఇక్కడ వుద్దిష్టమైన లౌకిక

గానాలు ఆళ్వారుల నాలాయిరప్రబంధం నయనారుల తేవారాలు అయివుంటవని అనుకొంటున్నాను.

नैषां न्याय्य इह द्विजान्वयजुषां भाषाप्रबन्धे श्रमो
वेदे विश्वपुमर्थसाधनविधौ बद्धादरे जाग्रति
तीरं क्षीरपयोनिधेरुपगतो दैत्यारिदीप्त्यावृतं
को वा धावति दुग्धलब्धिचपलो गोपालकस्यालयम् ॥ (वि. द.)

(సమస్తపురుషార్థాలను సాధించడానికి వేదం బద్ధాదరమై వుంటూ వుంటే ఈ బ్రాహ్మణవంశ్యులకు (రామానుజీయులైన వైష్ణవులకు) దేశ్యభాషాప్రబంధాభ్యాసం అన్యాయ్యం. విష్ణుతేజస్సుచేత ఆవరించబడిన పాలసముద్రపుగట్టుకు పోయి యెవడు పాలకోసం సక్తితో గొల్లయింటికి పరుగెత్తుతాడు?)

" मुञ्चन्तः पञ्चयज्ञान् द्रविडभणितिभिर्मोहयन्तोऽनभिज्ञान् ॥"

(वि. द.)

"పంచయజ్ఞాలు విడిచిపెట్టి ద్రవిడభణుతులచేత తెలియనివారిని భ్రమపెట్టుతూ."

అని కృశానువుచేత

" उपादेयं प्राज्ञैरुचितविषयं द्राविडवचोऽप्ययुक्तार्थं हेयं भवति वचनं संस्कृतमपि ॥" (वि. द.)

(ఉచితవిషయమైనది ద్రావిడవచస్సుకూడా స్వీకార్యం అయుక్తార్థమైనది, సంస్కృతవచనంకూడా త్యాజ్యం)

स यासां व्याकर्ता चुलुकितसमुद्रो मुनिवरः
प्रबन्धारः प्रौढाः शठमथनमुख्याः शमधनाः
प्रवक्तारः शुद्धाः प्रथितयशसः पूर्वगुरवो
गिराम्पारे तासां जयति गरिमा द्राविडगिराम् ॥ (वि. द.)

(వేటికి సముద్రాన్ని ఆచమనంచేసిన ఆమునిశ్రేష్ఠుడు వ్యాకరణం రచించాడో, వేటికి శమధనులైన శఠకోపముఖ్యులు ప్రౌఢప్రబంధలో,

వేటికిప్రథితయశస్సుగల శుద్ధులు పూర్వగురువులు(రామానుజాదులు) ప్రవక్తల్లో ఆద్రావిడవాక్కుల గరిమ వాగగోచరంగా వర్తిస్తున్నది.) అని విశ్వావసుచేత వేంకటాధ్వరి చెప్పించిన వచనాలు ఆకాలంలో సంస్కృతానికి దేశ్యభాషలకు వుండిన సంఘర్షాన్ని తెలుపగలవు. రూపకాలకు సంబంధించిన సాహిత్యగ్రంథాల్లో యీప్రాకృతభాషలు మధ్యమాధమపాత్రలకు యేతీరున వుద్దిష్టమయిందీ స్పష్టంగా తెలుసుకొనవచ్చును. అయితే మతవిజ్ఞానభాషాగౌరవం యియ్యకపోయినప్పటికీ సంస్కృతం ద్వారా పరిణతబుద్ధులైన విబుధులు కొందరు అనువాదాదుల్లోకి సంగ్రహాల్లోకి దిగకుండా స్వతంత్రంగా ఉత్తరభారతపు ప్రాకృతాల్లో కావ్యాలు రచించారు గనుక కావ్యశాఖ అయినా కొంతవరకు పరిణతులకు గణనీయమైనదిగా యేర్పడ్డది. బాణుడివంటి విద్వాంసుడిచేత

" कीर्तिः प्रवरसेनस्य प्रयाता कुमुदोज्वला ।
सागरस्य परं पारं कपिसेनेव सेतुना ॥" (ह. च.)

అని కీర్తితమై ఆనందవర్ధనుడివంటి సాహిత్యవేత్తలకు ఉదాహరణాలను సమకూర్పదగిన వాఙ్మయం శృంగారబహుళమైనా యేర్పడ్డది. కొందరు స్వతంత్రించి రూపకాలుకూడా రచించారు. ఉపలభ్యమానమైన రాజశేఖరకృతికర్పూరమంజరివంటివి రూపకాలింకా కొన్ని వుండివుంటవి. తెలుగులో యిట్లాటి స్థితిమృగ్యం. అనువాదాలు తుద్రంగా వున్నవని తెలిపినాను. స్వతంత్రరచనల్లో ఒకటిరెండు తప్ప తక్కినవి వ్యంగ్యవినాశంతో అన్ని తెలుగుకృతులకూ సమానమైన మురికిపద్యాలకసవుకుప్పలతో నిండి కవితావిషయాన అధమంగా వున్నవి. ప్రాకృతకృతికర్తలు సంస్కృతశబ్దాలను వాడనట్లే తెలుగులోకూడా కొందరు సంస్కృతశబ్దాలను త్యజించి అచ్చతెలుగుగ్రంథరచన ఆరంభించారు. అయితే ఆపని సాధ్యంకాలేదు. కవిత్వందాకా పోవడం యెందుకు? ఇప్పటి టెల్లిగ్రాఫు భాషవలె వారేర్పరుచుకొన్న తిక్క

